కృష్ణ—ప్రేయసీ! ఇట్టి కఠినోక్తులు నాయెడఁదగునా? ఇంకనైన నీప్రణయకోపంబు వదలి నీవు సుఖించి నన్ను సుఖింపఁజేయుము. ఈ వసంతర్తువున నిట్టి ప్రణయకోపము ప్రాణాంతక మగు. అదే యాగవాక్షమార్గమునఁ జూడుము.

తే॥ గీ॥ ప్రణయకోపమ్ము విడకున్నఁ ♦ బ్రాణహాని
తథ్య మని దంపతులకు మా♦ధవుఁడు దెలుపఁ
బత్రములసుమాక్షరముల ♦ వ్రాసికట్టెఁ
బాదపోపశాఖలసూచె ♦ ప్రకటనముల. 23

(చుబుకము నిమురఁబోయి విదల్పఁబడి) ప్రేయసీ! ఇంకను నీ మాఢ్యమేనా? నామాట విని, తర్వాత—

సత్య—నీమాట వినియే నే నీయవస్థకు వచ్చితిని. ఇంక నన్ను విడిచి పోయి నిన్ను భక్తితోఁగొల్చు పడతుల ననుగ్రహించి గొంతుఁగోయుము. నీకింక నాప్రేమ మెందులకు? (చెవుల వ్రేళ్లుంచుకొనును)

కృష్ణ—ప్రియా! ఇంతవఱకు నే నప్పుడప్పుడు చూపుచున్న యుదాసీనతకుఁ గారణము లేకపోలేదు. నాకు నీయందలి ప్రేమ మగణ్యము, అనిర్వాచ్యము, అఖండము. (సత్యభామ సంశయము సూచించును.) ఇందులకు నాయంతరాత్మయే సాక్షి. వలపులు హృదయైకసాక్షికమ్ములు గాన నే నింతకంటె నేమి నుడువఁగలను?

సత్య—నీచర్యలో—

కృష్ణ—నాచర్యలన్నియు నాకు నీయెడఁగల ప్రేమకు సూచకములే.

సత్య—అవునవును. నన్నుఁ దిరస్కరించుటగూడ నీప్రేమసూచకమే యగునా?

కృష్ణ—నిస్సంకోచముగా, అసంతోష మభ్యుదయమున కాలవాలము గదా! ఈరహస్యముం గనుంగొని నీకు నేఁ జూపఁగోరి నప్పుడప్పుడు సపత్నులం దనురక్తునట్లు నటించి యసంతుష్టిఁ గలిగించి

నిజంబుగా నీచేత వరముల నడిగించుకొని సంతసమందఁ దలఁ
చుచుండు. నిన్ను సంతసపెట్టఁ దలఁచుచుండు.

మ॥ నిరతంబుగా భవదీయకింకరుఁడనై ♦ నే నున్న నీ వంతతోఁ
బరితృప్తిఁగని నన్నుఁ గేవరములం ♦ బ్రార్థింప వేమో యటం
చరవిందాక్షి! సపత్నులం దనిపి నీ ♦ కందం దసంతుష్టిఁ జే
కుఱఁగాఁ జేసి వరంబు లీఁదలఁతు సం♦కోచంబుఁ బోనాడుమా!

సత్య—(దండ కరిగి) నాథా! ఇది విశ్వసనీయమా? నిక్కువమా?

కృష్ణు—చేలా! నిక్కువము గాకేమి? పారిజాతలతాంతవృత్తాంత మించుక స్మరింపుము. వలచినసతి కోరినవరము లొసఁగి సతిని దనిపి తాను దనియుట పతిధర్మము గాదా!

సత్య—అయిన మీరు నాచే వరముల నడిగించుకొనుటకా యిట్లొనర్చునది?

కృష్ణు—సత్యా! అంత నమ్మకము లేకున్న నిప్పుడొక వర మడిగి పరీక్షింపరాదా?

సత్య—(స్వగ) ఇఁక నా నోముఁ జేసిన ట్లొనర్చెద. (ప్రకాశముగా—చేఁబట్టి) అట్లే కానిండు.

ఉ॥ ఇంతకుమున్నె నారదము♦నీశ్వరుఁ డిచ్చటి కేఁగుదెంచి, నా
చెంతకు నేఁగుదెంచి చెలఁ♦గి చెప్పె, వ్రతం బొకఁ డాచరింపు మ
త్యంతశుభావహం బగు న♦టం చటు సేయుఁగ నీదుసాయ మొ
క్కంతయు నవశ్య మౌ నను మ♦హాత్మ! దాని నొనర్తె? చెప్పుమా.

కృష్ణు—సత్యా! నారదుఁడు వ్రత ముపదేశించియుండ, నీవు దాని నల్పముండ నాసాయమునకు సందియపడనేల? చెప్పుట కాలస్యముగాని, చేయుట కాలస్యము గలుగఁబోదు.

సత్య—హృదయేశా! నారదుఁడు నన్నుఁ బుణ్యకవ్రత మాచరింపు మనినాఁడు. దాని విధానమును మీ రెఱుఁగుదురా?

కృష్ణు—ప్రేయసీ! నిరంతరనారీవిహారసంసక్తచిత్తుండ నగు నా కా

వ్రతవిధాన మెట్లెఱుకపడును? అదెట్టిదైనను త్రికాలవేది యగు నారదమహర్షి నుడివినది కాన నవశ్యకర్తవ్యంబు.

సత్య—ప్రాణవల్లభా! అందుల కొఱకదాన మావశ్యకము. దానిని వేఁడ వెనుదీయుచున్నదాన.

కృష్ణ—ఏ మది? ధనములా? ధాన్యములా? నగలా? హర్మ్యములా? మణులా?

సత్య—అవి కావు. మీయనుగ్రహమునఁ దండతండములుగా నయ్యవి నాదండ లేవా?

కృష్ణ—ఇం కేమి వలయు? దాసదాసీజనంబులా? రాజ్యములా?

సత్య—కావుకావు. ఇంకను నూహింపుఁడు.

కృష్ణ—అయిన నద్దియో నీవే నుడువవలయు. నా కేమియు దోఁచు టలేదు.

సత్య—మీరు దాని నూహింప లేమని యొప్పుకొనిరిగదా? అట్లయిన దగ్గరకురండు. చెవిలోఁ జెప్పెద. (కృష్ణుఁడు రాఁ జెవిలో) భర్తృదానముసుడీ!

కృష్ణ—సత్యా! ఏమి దానము? భర్తృదానమా! నీప్రేమ మింతమాత్రమే యగునా?

చ॥ 'అసదృశరాగమొప్ప భవదంఘ్రిసరోజయుగంబుఁ గొల్తు నా
కసువులుగల్గునందనుక' నంచు వచించియు నిట్టు లన్యుకై
వసమొనరింపఁజూచెదవు భామరొ! నాపయిఁ బ్రేమమాసెనో,
విసుగుజనించెనో, మదికి వెక్కసమయ్యెనో నాచరిత్రముల్?

సత్య—ప్రాణేశా! అట్టిదసంభవ మని మీరుఁ దెలియదా? మీపుణ్యానురాగైకాస్పదనుగా నీవ్రతము నాచరింప నిశ్చయించుకొంటి వ్రతాంతమున మీదాన మావశ్యక మఁట!

కృష్ణ—సత్యా! ఇది వింతవ్రతముగా నున్నదే! సన్నెవరికి దాన మియ్య నిర్ణయించితివి?

సత్య—ఎవరికో యననేల! మిమ్ముల నిరంతరముఁ గొనియాడు నారద మునీంద్రునికే.

కృష్ణ—ఓహో! నారదునకు నన్ను దాన మిచ్చెదవా? సత్యా! నేను నీదాస్యము ననాయాసముగా నొనర్పగలనుగాని, యీ జడదారి దాస్యము నొనర్పఁగలనా!

సీ॥ కస్తూరికాతిలక•మ్మును బోనాడి
యూర్ధ్వపుండ్రంబుల • నుంచుమనునొ?
మౌక్తికహరినీల•మణిహారముల మాని
తులసిపేరుల మెడఁ • దొడుగుమనునొ?
పీతాంబరంబును • వీడ్కోలుగావించి
కాషాయవస్త్రంబుఁ • గట్టుమనునొ?
లలనామణీసంగ•లౌల్యంబు విడనాడి
సంయమివ్రతమును • సలుపుమనునొ?
తే॥ గీ॥ యింక నేమి వల్వదనునొ? • యేమి సేయు
మనునొ? యీ కలహాశనుఁ • డాత్రిలోక
గమనుఁ డసంయమీంద్రుండు • కలికి! యతని
వశము ననుఁ జేయుఁగా నీకుఁ • బాడి యగునె? 37

సత్య—మనోహరా! మి మ్మాతనికి దాస్య మొనర్ప నిత్తునా? దాన మొనర్చిన యుత్తరక్షణమె మిమ్ముఁ బ్రతిగ్రహింపకున్న నే జీవింపఁగలనా? మీ కింతమాత్రము తెలియదా?

కృష్ణ—సత్యా! తెలియక కాదు. పరిహాసమున కట్లంటి. సంశయింపక నీయిష్టానుసారము దానమిచ్చి నీ మనోరథంబు నీడేర్చుకొనుము.

సత్య—నాథా! నీబోటిపతులుగదా, సతులపాలిటి పారిజాతములు! దానానంతరమున నారదమహర్షికి మీ యెత్తు ధనముఁగాని, ధనేతరముఁగాని యిచ్చి మిమ్ము మఱల గ్రహించెద.

కృష్ణ—ప్రేయసీ! నన్నుఁ దూఁపగల ధనము నీకడ నున్నదిగదా!

ఉ॥ వ్రాసిన నన్నుఁ దూపఁగల • ద్రవ్యము లేకయ పుణ్యకవ్రితో
పానన నుం గడంగ, నెకఁ • బోటు నెపమ్మున నీకు నాకును
న్రోసము వచ్చుఁ గాన మును • ముందుగ నెమ్మది నుంత యోజనం
జేసి కడంగుమీ వ్రతముఁ • జేయ సరోరుహ పత్రలోచనా! 38

సత్య—నాథా! నారదమహర్షింబలె మీరును నాకడ నుండు ధన ధాన్యాదిసంభారపరిమాణ మెఱుంగక నట్లాడెద రేల? ఇందులకు మీ రావంతయు సంశయింపకుఁడు.

కృష్ణు—సత్యా! నారదుఁడుగూడ నీ ధనపరిమాణముంగూర్చి సంశయించెనా?

సత్య—అతఁ డజ్ఞానవశంబున నట్లాడె. పోనిండు. ఇంక నూరిలోఁ బిలువ నెవరిఁ బంపుదము.

కృష్ణు—మన వసంతకునిఁ బంపుదము. వసంతకా! నీ వేఁగి యీయూరి బ్రాహ్మణ్యమును భర్తృదానవృత్తాంతముఁ దెల్పక తేపటి వ్రతమునకుఁ బిలిచి వచ్చెదవా?

వసం—తప్పక పిల్చివచ్చెద. తేపు నాకు భూరిసంభావన నీయవలయు సుమా!

కృష్ణు—అట్లే. పోయి రమ్ము. (వసంతకుఁడు నిష్క్రమింప)

సత్య—నలినీ! నీవేఁగి ముత్తైదువలఁబిలచి రమ్ము. (నలిని నిష్క్రమింప)

కృష్ణు—సత్యా! నాతలిదండ్రుల, నన్నదమ్ముల, నీసపత్నులమాత్రి మాహ్వానింపకుము. వా రీదానమున కడ్డు పడెద రేమో?

సత్య—నాథా! బ్రాహ్మణ్యమును దక్క బంధువర్గమును బిలువఁద లఁపలేదు. ఇంక లోనికేఁగి తేపటి వ్రతమునకు వలసిన కార్య సన్నాహ మొనర్తుము రండు.

కృష్ణు—ప్రేయసీ! ఆవసంతకుఁడు బ్రాహ్మణుల నాహ్వానించుటయుం దెట్టి వికటచేష్టలొనర్చునో యని నామనంబు కళవళపడుచున్నది.

సత్య—హృదయేశా! ఏ మొనర్చిన నేమి? మీ ప్రేమాంబువృష్టి నాయెడ వెల్లివిరియుచుండ నా కొండు భయావహం బగునా?

కృష్ణు—గోలా! నీకు శంకలన్నియు ఱేపటితో నిర్మూల మగు. అంతట నీవు ధన్య వయ్యెదవు.

సత్య—నిక్కముగా ధన్య నయ్యెద. ఇదంతయు నారదమునీంద్రుని యొక్కయు మీయొక్కయు ననుగ్రహఫలమే గదా! ఇఁక రండు. లోని కేఁగుదము.

కృష్ణు—(స్వగ) ఱేపు సత్య నిక్కముగా ధన్యయగుఁగాని, తా నను కొనునట్లు కాదు. (ప్రకా) సత్యా! రమ్ము.

(నిష్క్రమింప యవనిక పడును.)





# శ్రీకృష్ణతులాభారము

## తృతీయాంకము



### ప్రథమరంగము.

స్థలము: సత్యభామ శుద్ధాంతము.

[శ్రీకృష్ణుఁడు పట్టువస్త్రములఁ దాల్చి యాసీనుఁడై యుండ వసంతకుఁడు దండ నిల్చియుండును.]

కృష్ణు—వసంతకా! ఈ ప్రసంగమును తులాభారమును గూర్చి యెవ్వరితోఁ నుడువలేదుగదా!

వసం—వయస్యా! అన్నియు స్త్రీలోను రెండుమూఁడుకల్లలాడి తప్పించుకొంటిని గాని, కాని—

కృష్ణు—వయస్యా ఏమట్లు సంశయించుచున్నావు? ఎవ్వరితోనైనఁ జెప్పితివా యేమి?

వసం—పరులతో నెవ్వరితోడను గాదు. మాయింటియాపెతోడనే. దానికడ నాబొంకులు చిల్లిగవ్వ కొఱకు రాలేదు. అదిగుచ్చిగుచ్చి యడిగి కనుగొనలేక గుట్టుబయటఁబెట్టినఁగాని భోజనముఁ బెట్టనన్నది. అప్పుడు విధిలేక చెప్పవలసివచ్చె. చెప్పినప్పటినుండి తానుగూడఁ బుణ్యకవ్రతము సల్పెద నని పట్టుపట్టె.

కృష్ణు—వసంతకా! సభార్యకుఁడ నేఁడు పుణ్యకవ్రత మొనర్చునా యేమి?

వసం—అదియు, సత్యాదేవియు నెచ్చెలులు. ఒకయూరుననే చదివిన వారు.

కృష్ణ—తరువాత నేమి జరిగినది ?

వసం—నే నప్పుడు సరే యని యంగీకరించితిని. కాని మఱల, నన్ను దాన మొనర్చి, నీ పేరు లేని ప్రతిబంధము పెనిమిటి తొలఁగి పోయినదే చాలు నని గ్రహింపదేమో ? ఎవరికి దాస్య మొనర్పవలసివచ్చునో యని యుదయముననే వ్రతమునకు సన్నాహ మొనర్చితచ్చెద నని నీకడకుఁ బరుగెత్తి వచ్చితి.

కృష్ణ—వయస్యా ! నీ భార్య మనగుట్టు బయటఁ బెట్టునా ?

వసం—అందులకు సందియ ముండదనియే నాయభిప్రాయము. సము ద్రమునైన నీఁదవచ్చుఁగాని దానినోరుమూయఁ దరము గాదు.

కృష్ణ—పోనిమ్ము. దాన మన కగు కొఱఁతయేమియు లేదు. (నారదు గానము వినఁబడ) అదిగో నారదుఁడుఁ గూడ వచ్చుచున్నాఁడు. నీవు లోనికేఁగి సర్వము సిద్ధముగా నొనర్పుము. నేనునునారదుఁ డును క్షణములో వచ్చెదము.

వసం—అట్లె యొనర్చెద. (వసంతకుఁడు నిష్క్రమింప, నారదుఁడు ప్రవేశించి)

నార—దేవదేవా ! పురాణపురుషా !

శా॥ విన్నంజాలదె మీ కథావళుల, మీ వేదాంతసద్గోష్ఠియుం
దున్నంజాలదె, మీభవాపహరసారోపాస్యరూపంబుఁ గ
న్గొన్నంజాలదె, మీజగన్నుతమహాగూఢార్థనామంబుఁ బే
ర్కొన్నంజాలదె ముక్తిగోరునతఁడో గోపాలచూడామణీ ! 39

కృష్ణ—నారదా ! నీ భక్తి కెంతయు సంతసించితి. నీమనోభీప్సితంబుఁ గనుగొంటి. అది నేఁడే యీడేరును. సత్య ప్రేమను భక్తిగా మార్చ నెంచి నేనే దీని నంతయుఁ బన్ని నిన్నుఁ గారణమా త్రుఁగా నొనర్చితి. శచీదేవి కసంతుష్టిఁ గల్పించినది నీకుఁ

## ద్వితీయరంగము.

స్థలకము—దానమంటపము.

[శ్రీకృష్ణుఁడు సత్యభామయు సుస్నాతులై పట్టువస్త్రంబులఁ దాల్చి సర్వాలంకృతులై సుమదామముల ధరించియుందురు. సత్యభామచే గర్గుండు వ్రతముఁ జేయించుచుండును. నారదుఁడు ప్రక్కన నాసీనుఁడై యుండును. వసంతకుండు నలిని బ్రాహ్మణులు ముత్తైదువులు చుట్టుప్రక్కల నాసీనులై యుందురు. ఒకతుల కట్టబడియుండును.]

గర్గ—సాత్రాజితీదేవి! వ్రతము ముగిసినది. ఇంక దానంబులు నిల్చి యున్నవి. మున్ముందు భర్తృదాన మున్నది. దాని నుపక్రమింతునా?

సత్య—ఆర్యా! అట్లే కానిండు.

గర్గ—సభాసదులారా! ఈనోమునోచు నారీమణులు తమప్రాణేశ్వరుల నొకవిశిష్టవంశజుండును, సద్వ్యయనసంపన్నుండును, శాస్త్రవేత్తయు, శాంతిదాంతిసమన్వితుండును, శుభాకారుండును. శిష్టాచారవిభూషణుండును నగు తాపస పుంగవునకు దానమొసంగవలయు. తర్వాత నాప్రతిగ్రహీతకు శక్తిప్రకారంబు భర్తను దులఁదూఁచఁగల ధనమునేని ధనేతరమునేని యొసంగి మరల భర్తను గ్రహింప నగు. ఆదాన మిప్పుడొనర్ప వలసి యున్నది. ఆదానపరిగ్రహణంబునకు మీలో నెవ్వరేని పాత్రులున్నఁ దెలుపఁగోరెద.

వసం—(ఒక బ్రాహ్మణుని దండఁజేరి) అప్పయదీక్షితులూ! మీపేరుఁ జెప్పి మీ కాదాన మిప్పింతునా? మీశుభాకారము నిర్వర్ణనీయము గదా!

అప్ప—వసంతకా! నలుగురిలో నాపరువుదీసితివా, యొక చెంపకాయ తీసెద. భద్రము!

తత్త్వము నెఱిఁగి భక్తిమహాత్త్వ మెఱిఁగి
పరమధామంబుఁ గాంతురు బ్రహ్మతనయ!

నారద—దేవా! ఏతద్విపన్మాహాత్మ్యశ్రవణంబున నెంతయు ధన్యుండ నైతి.

కృష్ణ—నారదా! ఎల్లరు దీని గ్రహించి ముక్తిఁ గాంతురుగాక! ఇఁక దానమంటపమున కేగుదము రమ్ము. (నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము.

స్థలము—దానమంటపము.

[శ్రీకృష్ణుండు సత్యభామయు సుస్నాతులై పట్టువస్త్రంబులం దాల్చి సర్వాలంకృతులై సుమదామముల ధరించియుందురు. సత్యభామచే గర్గుండు వ్రతముం జేయించుచుండును. నారదుండు ప్రక్కన నాసీనుండై యుండును. వసంతకుండు నలిని బ్రాహ్మణులు ముత్తైదువలు చుట్టుప్రక్కల నాసీనులై యుందురు. ఒకతుల కట్టబడియుండును.]

గర్గ—సాత్రాజితీదేవి! వ్రతము ముగిసినది. ఇంక దానంబులు నిల్చియున్నవి. మున్ముందు భర్తృదాన మున్నది. దాని కుపక్రమింతునా?

సత్య—ఆర్యా! అట్లే కానిండు.

గర్గ—సభాసదులారా! ఈనోమునోచు నారీమణులు తమప్రాణేశ్వరుల నొకవిశిష్టవంశజుండును, నధ్యయనసంపన్నుండును, శాస్త్రవేత్తయు, శాంతిదాంతిసమన్వితుండును, శుభాకారుండును. శిష్టాచారవిభూషణుండును నగు తాపస పుంగవునకు దానముసంగవలయు. తర్వాత నాప్రతిగ్రహీతకు శక్తిప్రకారంబు భర్తను దులందూంచంగల ధనమునేని ధనేతరమునేని యొసంగి మరల భర్తను గ్రహింపనగు. ఆదాన మిప్పుడొనర్ప వలసియున్నది. ఆదానపరిగ్రహణంబునకు మీలో నెవ్వరేని పాత్రులున్నం దెలుపంగోరెద.

వసం—(ఒక బ్రాహ్మణుని దండం జేరి) అప్పయదీక్షితులూ! మీపేరుం జెప్పి మీ కాదాన మిప్పింతునా? మీశుభాకారము నిర్వర్ణనీయము గదా!

అప్ప—వసంతకా! నలుగురిలో నాపరువుదీసితివా, యొక చెంపకాయ తీసెద. భద్రము!

వసం—(పరుగెత్తి వేసోక బ్రాహ్మణుని సరస కేఁగి) చ్యవనులుగారూ! మీ కిప్పింతునా ?

చయ—వసంతకా ! నీ కోఁతి మాటల మానుము. నా దక్షిణలో నీకు సగ మిత్తును లెమ్ము.

సోమయాజు—ఆర్యవర్యా ! ఈ విషయమున సందియ మందనేల ? మీరు నుడివిన సర్వలక్షణంబులకును లక్ష్యంబైన నారదమునీంద్రునకంటె నిట్టి యుత్తమదాన పరిగ్రహణంబునకుఁ బాత్రు లెవ్వ రుందురు ? కావున నా దేవర్షి చంద్రుండే యీదానంబుఁ గొన నర్హుండు.

గర్గ—సభాసదులారా ! ఇంక నేమేని భిన్నాభిప్రాయములు గలవా? (కొంతకాల మూరకుండి) ఇఁక మీ మౌనమునే పూర్ణాంగీకారసూచకముగాఁ గైకొని నారదునకు శ్రీకృష్ణుని దాన మిప్పించెద.

నార—ఆర్యులారా ! ఈ యుత్తమదానము నా కీయ మీ రంగీకరించి నందులకెంతయు మీకుఁ గృతజ్ఞుఁడను. ఈ దాన పరిగ్రహణంబున నే నెంతయు ధన్యుండ నగుదును. దానాంతరము శ్రీకృష్ణుఁ దులఁదూఁచు సంభార మిచ్చిన మఱల సత్యాదేవి కతని నొసంగెద !

గర్గ—దేవీ ! ఈపుష్పహారంబు శ్రీకృష్ణుని చేలాంచలమునకుఁ గట్టి యా పారిజాతవృక్షంబునకుఁ గట్టుము. ఆవృక్షంబునుగూడ దాన మొనర్ప నెంచితివిగదా ?

[సత్యభామ పుష్పహారముఁ గైకొని కృష్ణునిదగ్గరకు వ్రీడాకుల చిత్తయై రాఁ గృష్ణుఁడు నవ్వుచు లేచి తన చేలాంచలమును సత్యచేతి కందిచ్చు]

కృష్ణ—

మ॥ నవలా ! సిగ్గిల నేల? యీవ్రతవిధానం బీదృశంబౌట, లో
న విచారింపక నన్నొసంగి మఱలన్ వైళంబుగా నీముని

పరివరుం డాడినయట్లు నాబరువు ద్రవ్యం బిచ్చి కైకొంచు, బాం
ధవవర్గంబుల వన్నెవాసిఁగనుమా తారార్క-చంద్రంబుగాన్.

(సత్యభామ పూలహారముతో శ్రీకృష్ణుని పారిజాతవిటపంబు నకుఁ గట్టును.)

నార—(లేచి) (స్వగ) ఆహా! ఏమీ దేవదేవుని విచిత్రవర్తనము! నాఁడు బలిని గట్టినవాఁడు, జితేంద్రియులఁ దపోధనుల మానసాలానబంధమున నేనిఁ గట్టఁబడనివాఁడు నేఁ డొక యబలచేఁ బారిజాతవృక్షంబున కొకపూలదండచేఁ గట్టం బడియె. ఈ మహామహునిచర్యలు దుర్గూహ్యంబులుగదా!

గర్గ—దేవీ! ఇంక నారదునకు నీ ప్రాణేశు ధారవోయుము. నారద మునీంద్రా! ఇటు రమ్ము. (నారదుఁడు రాఁ బాదములఁ గడిగించి సత్యచేతులలో నీరువోసి శ్రీకృష్ణుని చేతులగుండ నారదుని చేతులలో "తుభ్య మహం సంప్రదదే నమో నమః" అని చెప్పించి విడిపింపఁజేయును). మునీంద్రా! ఇఁకఁ బారిజాతంబును శ్రీకృష్ణుఁడును నీవి.

నార—ఆహా! ఎంత కృతార్థుఁడనైతి?

ఉ॥ ఏమితపం బొనర్చి జనియించినవాఁడనొ, నేఁడు సత్యభా
మామహిళావ్రతంబున సమంచితరీతిఁ బ్రతిగ్రహించితిన్
గామితసిద్ధిదాయకుని, ఖండితదుష్టనిశాటు, సర్వమ
ర్త్యామరపూజితాంఘ్రి నఖిలాఘవిదూరు, ననంతు, నచ్యుతున్.

గర్గ—దేవీ! ఇఁక బ్రాహ్మణులకు దక్షిణతాంబూలము లొసఁగ వచ్చునా?

సత్య—ఆర్యా! ముందు తులాభారము జరుపఁగూడదా?

గర్గ—దానిని పిమ్మట జరిపెదను. నలినీవసంతకులారా! ముత్తైదువులకు బ్రాహ్మణులకు దక్షిణతాంబూలము లొసంగుఁడు. (నారదుఁడు శ్రీకృష్ణుని సుమదామమునఁ బట్టుకొని యెడముగా నిలువ, నలినీవసంతకులు దక్షిణతాంబూలాదు లొసంగుదురు. బ్రాహ్మణులు దక్షిణం గొని తమతృప్తిని వెల్లడిఁ

జేయుదురు. బ్రాహ్మణులందఱు లేచి నిలుచుందురు. సత్య కృష్ణునివంకఁ జూచుచుండును.)

నార—భూసురులారా! ఉండుఁడు. తులాభారముఁ దిలకించి పొండు. దేవీ! ఇఁకఁ దులాభారమున కుపక్రమింతమా?

సత్య—సత్వర మట్లొనర్పుము.

గర్గ—మునీంద్రా! శ్రీకృష్ణునిం దోడి తెమ్ము.

నార—అట్లే. దేవా! రమ్ము. (కృష్ణుని బూలదండతోఁ బట్టి తెచ్చి తులలోఁ గూర్చుండఁబెట్టి) దేవీ! ఇఁక నీవిభుని దూఁపఁగల పదార్థములఁ దెప్పింపుము.

సత్య—నళినీ! నాపి గొలికవాఁడు సొమ్ములఁ దెచ్చియుంటివే. వాని నీత్రాసునం దుంచుము. వసంతకా! నీవు నళినికి సాయమొనర్పుము. (నళినీవసంతకులు సొమ్ములఁ ద్రాసునవైవఁ ద్రాసు కదలకున్న) త్రాసు కదలనే లేదా? ఏమిది? నామిగిలిన యాఱునాల్పు నగలను దెచ్చివేయుఁడు (అట్లొనర్చినను ద్రాసు కదల కున్న) ఏమిది? త్రాసు మోయునంత బరువిడినను యింతా కంతయేని కదలకున్నది. (త్రాసుఁ జూచి) వసంతకా! నీకీ త్రాసునం దేమైన లోప మగుపడుచున్నదా? చూచి చెప్పుము.

వసం—(ఇటు నటు త్రాసును బరికించి) ఇం దేమియు దోసము నాకుఁ గనఁబడుటలేదు గాని యేదో మోసముమాత్ర మున్నది. లేనిచో నింతబరువు మానవమాత్రుఁ డుండునా? ఇంకను బ్రయత్నింపుము.

సత్య—అట్లు తప్పక యొనర్చెద. నళినీ! నీవు నాఁటిల నేఁగి శ్యమంతక మణి యొసఁగిన బంగారము నంతయుఁ దెప్పించి వేయించుము. దానితోఁ ద్రాసు తప్పక కదలవలయు. (అట్లొనర్చినను ఫలములేకున్న) అక్కటా! ఇ దేమి మాయ? మునీంద్రా! నామనోవిభుండు నిక్కముగా నింతబరు వున్నాఁడా?

నార—దేవీ! సాధ్యమయిన నట్లే యొనర్పవచ్చును.

సత్య—నలినీ! మనమందిరమునఁగల ప్రతిపదార్థమును దెచ్చి తులయం దుంచుము. (అట్లొనర్చినను బ్రయోజనము లేకున్న) మునీంద్రా! ఇం దేదో తంత్ర మున్నది. లేకున్న నానాథుఁ డేమి? ఇంత విపరీతబరువు వుండు టేమి?

నార—దేవీ! ఇంత బరువా? ఆ భార మెవరి కెఱుక?

తే॥ గీ॥ అండపిండవేధాండసమూహము లెల్ల
గుప్తగతి బొజ్జలో నుంచుకొన్నయట్టి
తోయజాక్షుని తాఁ దులఁ దూఁపఁగలవె
ధనముల ధనేశ్వరమ్ములఁ దరళనయన! 7

సత్య—మునీంద్రా! నన్నిప్పుడు వ్రతమొనర్పఁ బురికొల్పి యిప్పు డీ మాటాడఁ బాడి యగునా! అప్పుడే యితఁ డింతబరువు వుండు నని చెప్పరాదా?

నార—దేవీ! నేఁ జెప్పితినిగాని నీవు దానిఁ దెలిసికొననైతివి. ఈ శ్రీకృష్ణుండు మెట్టినుగం డని యెంచితివి గాని ప్రకృతిస్వరూపుం డని యెఱుఁగవైతివి. దానికి నే నేమందును?

సత్య—నామనోహరుఁ దులఁదూఁపలేని సంభారము లేవియో నీయభీష్టమగు వస్తువును గైకొని నానాథుని నాకిచ్చి పొమ్ము. అతనితో నీ కేల? ఇదిగో నీ శ్యమంతకమణిఁ గొమ్ము.

నార—దేవీ! నాకు శ్రీకృష్ణుఁ దులఁదూఁచినదియే వలయు. ఇతరములు నా కుపేక్ష్యంబులు. నీ వట్లు నిలుపలేకున్న నీతని విపణివీథికిం గొంపోయి యెవరికైన నమ్మెద. నాబోటి భిక్షాటునకు, దేశాటునకు నీ మహాత్ము భరింప శక్యమా?

సత్య—ఏ మేమీ? నాభర్తను సంగడిఁ బెట్టి యమ్మెదవా? అక్కటా! నారదా! ఇ దేమి వెఱ్ఱితనము? నీవు మాకు శ్రేయస్కామి వనుకొంటిఁగాని మా సవతి హితైషి వని తెలియనైతిని. మేఁక వన్నె పులి వని యెఱుఁగనైతిని. నిన్ను నమ్మి మోసపోయితిని.

చ॥ పతి నొక పూజనీయగుణ◆వార్థికి దాన మొసంగి, పుణ్యక
ర్మితమొనరింతువేని ఫల◆మంత మగుఁ భవదీయవాంఛితం
బతివరో! యంచు ము న్బలికి ◆ యట్లొనరించినయంత నన్ను నీ
వితమున ధాత్రపుత్రి! విల◆పింపఁగఁజేసెద వేటిన్యాయమో? 7

నార—కృష్ణా! ఈమాటలతో నేమి లాభము? లెమ్ము. అంగడివీధి కేఁగుదము. (కృష్ణుఁడు లేవఁబోవుచో)

సత్య—ఉండుఁడు. (మంగళసూత్రముఁదక్క మిగిలిననగలన్నిటిఁ దీసి తులయందు వైచినను లాభములేకున్న) నలినీవసంతకులారా! బ్రాహ్మణులారా! ఊరక చూచుచుండెద రేమి? మీమీ నగల నాణెములఁ ద్రాసున వేయుఁడు. అట్లైనను నానాథుఁడు నాకుఁ దక్కునేమో. (నలిని నగలను వసంతకాదులు పై వస్త్రములను దక్షిణతాంబూలములను నైవఁ ద్రాసు కదల కున్న) నాథా! (శ్రీకృష్ణునకు మోఁకరించి) నన్ను మీరే రక్షింపవలయు. తప్పను మన్నింపవలయు.

కృష్ణ—సత్యా! మనఃపూర్వకముగా నన్ను దానమొనర్చి యిప్పు డిట్లాడిన నేమి ప్రయోజనము?

చ॥ అతివరో! నన్నుఁదూఁచెడు ధ◆నాదులు నీకడ లేకయున్న దు
ర్గతులకు లోనుగా నగుదు◆గావున యోజనఁజేసి చేయు మీ
వ్రతమన నాలకింపక ప్ర◆వర్తిలి యీగతి నాడె దక్కటా!
గతజలసేతుబంధములు ◆ గావొకొ కాముకకోటియోజనల్? 8

సత్య—ప్రాణప్రియా! నా యజ్ఞానంబును క్షమించి నాకు మి మ్మోజడదారిమండి కొనుమార్గ ముపదేశింపుఁడు.

నార—కృష్ణా! నాయాన లేనిదే నీ వెవ్వరితో మాటాడకూడదు సుమా! లెమ్ము. (కృష్ణుఁడు లేవ)

సత్య—నారదా! ఇదే మన్యాయము? నానాథునితోడ మాటాడ నీయవా?

మ॥ అకలంకాత్ముఁడ వంచు నీ పనుపుఁ ♦ జేయంబూనితిగాని నీ
వకటా! యింతటి మోసగాఁడ వని స్వ♦ప్నావస్థయందేని మా
మకచిత్తంబున నెంచియున్నయెడ నీ♦మార్గంబునన్ బోవనా
యకు నీబోంట్లకు దానము న్సలిపి సౌ♦ఖ్యంబెల్లఁగోల్పోదునే? 9

నార—కృష్ణా! సత్యాదేవి నిన్ను మాకు దానమొనర్చినది సత్యంబ యేని మా భృత్యుఁడవై మా యభీష్టకృత్యంబు లొనర్ప వలయు.

కృష్ణ—నారదా! అందులకు సంసిద్ధుఁడనై యున్నాఁడ.

నార—అట్లయిన నిటు రమ్ము. (శ్రీకృష్ణుఁడు రా) అటుపొమ్ము. (పోవ) ఇటురమ్ము. (రా) కూర్చుండుము. (కూర్చుండ) లెమ్ము. (లేవ) ఇదిగో నీ మహతిఁ గైకొమ్ము. ఇదిగో కమండలువు. ఇందు మిన్నేటిజల మున్నది సుమీ! ఇదిగో నాకీశ్వరుఁ డిచ్చిన శార్దూలచర్మము. ఇదిగో యక్షమాల. రా రమ్ము. (కృష్ణుఁడు వాని నందికొని వెంట రా).

క॥ సేవలఁ గొంటయె కాసి
సేవించు టెఱుఁగనట్టి ♦ శ్రీనాథుఁడె నా
సేవకుఁ డయ్యెను, హరి భ
క్తావళికి విధేయుఁ డంట ♦ యన్నృతమ్మగునే? 10

కృష్ణా! రమ్ము. అంగడివీధి కేఁగుదము.

(నారద శ్రీకృష్ణులు నిష్క్రమింప)

సత్య—నారదా! నారదా! ఇట్టి యన్యాయము నీకుఁ దగునా? నిల్వుము. నిల్వుము.

(సత్య నిష్క్రమించును. నలిని వసంతకుఁడు బ్రాహ్మణులు వెంబడింతురు.)

## తృతీయరంగము.

స్థలము—ద్వారకాపురి విపణిశ్రేణి.
(కృష్ణుమెడలోఁ బూలదండఁ బట్టుకొని నారదుఁడు ముందు నడుచుచుండును. బ్రాహ్మణాదులు వెంబడింతురు.)

నార—పౌరులారా! రండు, రండు. శ్రీకృష్ణునెత్తుధన మిచ్చికొనుఁడు. ఇతఁడు భక్తులకు సులభసాధ్యుఁడు. వెనుదీయకుఁడు.

సీ॥ నీలాంబువాహసన్నిభశరీరుం డయ్యుఁ
దీవ్రాఘతిమిరప్రదీపుఁ డితఁడు
సత్యాకటాక్షవీక్షణబంధితుం డయ్యు
ధీరాతిధీరదుర్వారుఁ డితఁడు
ఆభీరికామానహరణలోలుం డయ్యు
సర్వసంపూజార్హచరతుఁ డితఁడు
మర్త్యజనప్రతిమానవిగ్రహుఁ డయ్యు
దేవావనీదేవదేవుఁ డితఁడు
తే॥ గీ॥ ధారుణీరాజ్యభారవిదూరుఁ డయ్యు
రాజరాజప్రపంచసామ్రాజ్యుఁ డితఁడు
కనుక వైళంబ శ్రీకృష్ణుఁ గొనఁగ మీరు
రండు రం డిట్టిలటి వేళ రాదు రాదు.

ఏమి మీ రెవ్వరునుఁ గొనలేరా? కృష్ణా! అదిగో సత్యభామ యిటు వచ్చుచున్నది. ర మ్మింక నొకవీధి కేగుదము.

[నిష్క్రమింప, సత్యభామ నలినీ సమేతయై (దుఃఖాక్రాంతయై) గాన మొనర్చుచుఁ బ్రవేశించును.]

సత్య—అక్కటా! నానాథుని నారదుఁ డింకొకవీధికిం గొంపోయె. ఏమి సెయుదును? ఎంతకాల మిట్లు వెన్నాడుదును? ఎట్టి

దుస్స్వప్నార్థమున నాయూరివేదంపుఁదపసిబోధనకుఁ జెవి
యొగ్గితినోగదా !

నలి—దేవి! ఇదంతయు నా కలహాశనుని కుతంత్రమే యగు.

సత్య—నెచ్చెలీ! అవును. కాని యీయెడఁ దప్పించుకొనుమార్గ మెయ్యదియో తెలియకున్నది. కాలము జరుగుకొలఁది నాబంధువర్గ మీవార్త విని నన్ను నిందింపవచ్చునని భయ మెత్తుచున్నది. అక్కటా! వారి కేమి ప్రత్యుత్తర మిత్తు?

సీ॥ దేవకీవసుదేవు ♦ లే వచ్చి మాపుత్రు
నేమిసేసితి వన్న ♦ నే మనుదును?
బలరామసాత్యకు ♦ లేవచ్చి మాసోదరు
నెందుఁ దోలితి వన్న ♦ నేమనుదును?
జాంబవత్యాదులు ♦ చనుదెంచి మా భర్త
నేటి కిచ్చితి వన్న ♦ నే మనుదును?
మదనసాంబాదులు ♦ నెదుఁరేగి మాతండ్రి
నెచటి కంపితి వన్న ♦ నే మనుదును?
తే॥ గీ॥ యాదవు లరుదెంచి ♦ మా దేవదేవుని
నె ట్లొసగితి వన్న ♦ నే మనుదును?
నేమి వల్కుదాన ♦ నేమి సల్పెడుదాన
నెట్లు మనెడుదాన ♦ నింక పైన. 11

నలి—దేవీ! సమాశ్వసిల్లుము. నీప్రాణేశ్వరుఁ గలిసికొందము, రమ్ము. తర్వాత నంతయుఁ జక్కఁబడును.

సత్య—అట్లే యగుఁగాక! రమ్ము. శ్రీకృష్ణు వెన్నాడుదము.
(నిష్క్రమింప)

నార—(మఱలఁ గృష్ణుని తోడ్తెచ్చి) పౌరులారా! రండు. రండు. ఈతని మహాత్మ్యమును వినుఁడు.

సీ॥ ఇతనిపాదమునుఁడీ ♦ పతితజవావన
సారభాగీరథీ ♦ జన్మభూమి

ఇతనివక్షమె సుండీ ♦ యిందిరాసుందరీ
మానితకేళికా ♦ మందిరంబు
ఇతనిచక్రమె సుండీ ♦ పృథుల దోర్వీర్యగ
ర్వాంధదైత్యానేక ♦ పాంసుళంబు
ఇతనిహస్తమె సుండీ ఋజుమార్గసంచార
సంరక్షణాసక్త ♦ సాధనంబు
తే॥ గీ॥ ఇతని దర్శనమే సుండీ ♦ శ్రితవితాన
జపతపోవ్రతపాదప ♦ సత్ఫలంబు
కాన నీతని గొన నను♦మాన మేది?
ధనములను దెచ్చి తులఁదూచి ♦ కొనుఁడు కొనుఁడు. 12

కృష్ణా! ఇం దెవ్వరును గొనువారు లేరు. మఱియు సత్యాదేవి కూడ నిటు వచ్చుచున్నది. రమ్మింకొకవీధి కేఁగుదము.

(నిష్క్రమింప సత్యభామ దుఃఖార్తయై ప్రవేశించి)

సత్య—అక్కటా! మఱల నామనోహరు నాకంటి కగపడకుండఁ జేసె అక్కటా! కుడిచి కూర్చుండక యీ వ్రతమున కేల పూనితిని? ఎట్లు ప్రాణేశుఁ బాసి జీవింతు? ఎట్లతని నారదుబారినుండి రక్షింతు? ఎట్లు మఱల నారదు గలిసికొందు?

(జాంబవతీ మిత్రవిందలకు మార్గముఁ జూపించుచు వసంతకుఁడు సత్య కెదురుగా వచ్చును.)

వసం—దేవేరులారా! అదిగో సత్యభామ. మీమగని దానమొనర్చి పొగులుచున్నది.

సత్య—అక్కటా! అరుగో నా సపత్నులు వచ్చుచున్నారు. వార లే మందురో? వారి కేమి ప్రత్యుత్తరమిత్తు? అయ్యో! ఎంత తెలివిమాలినకార్య మొనర్చితిని!

జాంబ—(సత్యను డాసి) సత్యభామాదేవీ! ఈ వసంతకునిమాట నిజ మేగదా! చేతులారఁ బ్రాణేశ్వరు నొరున కెట్లు దానమొనర్చితివమ్మా?

మ॥ హాలతుల్ పూర్వము ప్రాణనాథుప్రణయంబుం గోరరో? కోరి నో
ములను నోచ్చరో? నోమి దానములచే భూదేవులం దన్పరో?
జలజాతేక్షణ! వార లేరయిన నీచందానఁ బ్రాణేశు, న
న్యులకున్ దానమొసంగినారలె? వ్రతోద్యోగానురాగాత్మలై.

మిత్ర—సత్యాదేవీ! నీవు కృష్ణుసాహచర్యముతో నంత విసికితివా? ఏమయిన నాతని దాన మొసర్ప నేల?

ఉ॥ ఆకలహాశనుండు వనజానన! నీకుఁ బ్రీతిత్యుఁడైనచో
నీకయి కృష్ణుఁ డిచ్చినమణీకనకాంబరవస్తువాహనా
నీకము భక్తిమై నిడి గణించిననొప్పగుఁగాని నీకునుర్
మాకును బ్రాణనాథుఁడగుమాధవునిచ్చుట దెట్టి న్యాయమే?

జాంబ—బెల్లముగొట్టిన రాయివలె నూరకుండెద వేమి? నీ వెవ్వతెవని శ్రీకృష్ణు నారదునకు దాన మొసఁగితివి? నీ కట్లొనర్ప నధికార మెవ్వ రిచ్చిరి?

సీ॥ కనిపెంచి పెద్దఁజేసిన తల్లిదండ్రులు
దేవకియును వసుదేవుఁ డుండ
ననయంబు వెన్నంటుకొని కొల్చు సోదరుల్
హలధారణుండు సాత్యకియు నుండ
బతియె దైవం బని సతతంబుఁ బూజించు
పట్టమహిషి భీష్మపట్టి యుండ
నినుఁబోలె వాసుదేవుని చెట్టఁబట్టిన
సరసిజనేత్రలెంఱమొ యుండ
ఆ॥ వె॥ జనకులాలనమున ననుదిన వృద్ధిని
గనెడు మన్మథాదితనయు లుండ
కృష్ణుపట్ల నీకు నెటువంటి యధికార
మున్న దంచు దాన మొసఁగినావె? 15

మిత్ర—స్వార్థలాభంబు వాంఛించి నీతోడ మమ్మందఱ నన్యాయ మొనర్చితివి.

వసం—ఈతప్పునకు నిన్నేమి యొనర్చినను దోషములేదు. నాప్రాణ మిత్రునకు నాకు నెడఁబాటు గల్పించితివి.

సత్య—సపత్నులారా! మీచేత నే నిన్నిమాటలఁ బడవలసియుండ, నా వ్రాఁత నెవ్వరు తప్పింపఁగలరు? ప్రేమాంధనై యాకపట మునీంద్రుమోస మెఱుఁగలేక యతఁ డుపదేశించిన వ్రత మొనర్చి నాప్రాణమునకుఁ బ్రాణ మగు నందకుమారుఁ గోల్పోతి. మొదలునకే మోసముఁ దెచ్చుకొంటి. నా యజ్ఞానముం గనుఁగొంటి. ఇంక.

ఉ॥ ఈసది యైనదేమొ యిటు ♦ లాడిసేయుట యుజ్జగించి, యిం
కైనను బ్రాణనాయకుని ♦ హాటకగర్భతనూజునుండి చం
ద్రాననలార! యేగతిఁ గ్ర♦యంబడి కైకొన సాధ్యమౌనొ మీ
రానతియిచ్చి నా కతిద♦యాపరతం బతిభిక్షఁ బెట్టుఁడీ! 15

జాంబ—అట్లే యొనర్చెదము, రమ్ము. ఆ నారదుఁ గలిసికొందము.

(నిష్క్రమింతురు.)

(నారదుఁడు శ్రీకృష్ణునితోఁ బ్రవేశింప యాదవులు చూడవత్తురు.)

నార—యాదవులారా! రండు. కానుఁడు, మీ యదుకులసార్వభౌముని.

సీ॥ కొలిచెడువారికిఁ ♦ గొంగుబంగారంబు
పతనవిహ్వాలులకుఁ ♦ బట్టుగొమ్మ
చేమోడ్చువారికిఁ ♦ జేతిచింతామణి
అలసినవారికి ♦ నిలువనీడ
మ్రొక్కెడువారికి ♦ ముంగిటిపెన్నిధి
పిలిచెడువారికిఁ ♦ బెరటిసురభి
తపియించువారికిఁ ♦ ద్రావంగ నమృతంబు
అర్థించువారికి ♦ నమరతరువు

ఆ॥ వె॥ వాసుదేవుఁ డంచుఁ బద్మగర్భాదులు
నిత్య మితనిపాద◆నీరజములఁ
గొల్చుచుందురుగానఁ ◆ గొనఁగ వెన్దియొక
ధనముఁ దెచ్చి పోసి ◆ కొనుఁడు కొనుఁడు. 19

ఏమిరా కొనరా? అట్లయిన నీతని నిం కొకపురమునకు గొం పోయెద. అచ్చట కన్నుల నద్దుకొని కొనియెదరు. రా, కృష్ణా రమ్ము. (పోఁబోవ)

యాదవులు—ఒరే! యీజడదారి మనకృష్ణమూర్తిని మనకు లేకుండ నెక్కడికో కొనిపోవు నఁట! ఊరక చూచెద రేమి? కొట్టుడు, కొట్టుఁడు. (పైఁబడ)

నార—దేవా! నన్ను వీరిబారినుండి రక్షింపవలయు.

కృష్ణ—యాదవులారా! ఏమీ యాగడము? నా యనుమతమ్మున నా యర్ధాంగిచే నన్ను దానముగా గ్రహించిన యీ దేవర్షి చంద్రునా, మీరు గొట్టనెంచితిరి? ఈదుండగమునకు నాపైఁ బ్రేమచేతఁ బాల్పడితిరిగాన మిమ్ము క్షమించితి. పొండు.

యాదవులు—చిత్తము దేవా! క్షమింపుము. (నిష్క్రమింతురు.)

నార—దేవా! సత్యభామ వచ్చుచున్నది. ఆగర్వాంధకైన పరాభవంబు చాలును. ఇంక విమోచనమార్గమును నుడువు మనియెదరా?

కృష్ణ—నారదా! అట్లే కానిమ్ము.

(జాంబవతీ మిత్రవిందాసమేతయై సత్య పాడుచుఁ బ్రవేశించును.)

జాంబ—నారదమునీంద్రా! ఈ యమాయకురాలి వంచించి మా నాథుని దానము పట్టితివా?

చ॥ చదివితి నీవు సాంగముగ ◆ శాస్త్రసముచ్చయమెల్ల సైన నీ
యదనునఁ దల్లిదండ్రులు ని◆జాత్మజు నీయఁ బ్రతిగ్రహింపఁగా
నాదవునుగాని వేసతుల ◆ నొక్కతెయై చపలాత్మయైన యి
మ్మదవతి దానమియ్య నిటు ◆ మాధవుఁ గైకొన నీకుఁ బాడియే?

నార—దేవీ! ధర్మమువిషయము నన్నడుగకుము. శ్రీకృష్ణుం డంగీకరించె. సత్యాదేవి యొసంగె. నేను గ్రహించితి. ఇతరవిషయముల నీ ప్రాణేశ్వరునే యడుగుము.

జాంబ—(శ్రీకృష్ణునివంకఁ దిరిగి) ప్రాణేశా! మీ రెట్లీదానమున కీయకొంటిరి.

చ॥ పడఁతుల నెందఱెందరినొ ♦ పాణిగ్రహించినవాఁడవయ్యు ని
న్నొడగుఁదనాన నొక్క యలి♦వేణి ప్రదాన మొనర్పవేఁడ నీ
వడువున లాఁతిభార్యల శు♦భంబు దలంపక వల్లె యంచు నీ
వొడఁబడఁ బ్రాణనాథ! తగు♦నో తగదో యని చింతసేయవే?

సత్య—(కృష్ణుని పాదములపైఁ బడి) మనోహరా! నేఁ దెలివిలేక మిమ్ము దాన మొనర్చిన, మనఋణానుబంధ మింతతోఁ దెగెనా యేమి? మాఱుపలుకరాదా?

చ॥ కటకట! ప్రాణనాథ! యిది ♦ కర్జమె నిర్జరమానిఁగూడి యు
క్కటికము మానఁ ద్వత్ప్రియయ♦కాంక్ష వ్రతంబొనర్చినట్టి న
న్నిటువలె నొంచి మానమువ♦హించి చరించు తలంపుమాని యిం
కటనయినన్ దయామతిని ♦ దావకముక్తిపథంబుఁ జూపుమా. 22

నాథా! నీ శరణుఁజొచ్చితిని. నేఁడు నా కన్నుల పొరలూడె. నా యజ్ఞానంబు గ్రహించితిని. నా కింక మిమ్ము దాస్యవిముక్తుఁ జేయు మార్గ ముపదేశింపుఁడు.

నార—కృష్ణా! ఇంక నీవు మాటాడవచ్చును. వలసిన ప్రత్యుత్తర మిమ్ము.

కృష్ణు—సత్యా! నారదునే యడుగుము. అతఁడే నీకుఁ ద్రోవఁ జూపును.

సత్య—మునీంద్రా! ఇంకనైన నన్ను వేధించుటమాని రక్షింపుము.

జాంబ—మునీంద్రా! మీరు మా ధనకనకవస్తువాహనాదులఁ దూఁచి కైకొని నాథు వదలుఁడు.

నార—బేలలారా! ఇంకను శ్రీకృష్ణు ధనముతో ధనేతరముతోఁ దూఁచికొన నెంచెదరా?

ఉ॥ ఈ కమలాయతేక్షణు స♦మంచితమహత్త్వ మెఱుంగలేక, యీ
వీఁక ధనంబుచేత మణి♦బృందముచేత విభూషణాళిచే
నో కమలాక్షులార! కొన♦నూహయొనర్చెద రయ్యొ! శౌరి భ
క్త్యైకవశంగతుం డనుచు ♦ నింతటనైన నిజం బెఱుంగుఁడీ. 23

భక్తిపరిభావం బెఱుఁగక, భక్తజనావన బద్ధకంకణుఁడైన యా పరమాత్మయే కృష్ణావతార మెత్తెనని యాథిగా నమ్మక, మీరిట్లు వగఁ బొగులుచున్నారు. ఈతఁడు భక్తులకుఁ దక్క నితరులకు సులభసాధ్యుఁడా! వారల స్వవశులఁ జేసికొని వారికి వశుఁడై యనారతము సంచార మొనర్చుచుండు. ఇతని లోఁబరచుకొనఁ దలఁచువారలకు భక్తియే వశ్యౌషధము.

సీ॥ సర్వేశ్వరుం డగు ♦ శౌరిఁ గింకరుఁ జేయు
ధన మున్న దే భక్తి♦ధనముగాక?
సర్వోపగతుఁ డగు ♦ చక్రి బంధించెడు
బల మున్న దే భక్తి♦బలముగాక?
సర్వభోక్తను జల♦జాతాక్షుఁ దనియించు
ఫల మున్న దే భక్తి♦ఫలముగాక?
సర్వజ్ఞుఁడైన కే♦శవుని మెప్పించెడు
విద్యయున్నదె భక్తి♦విద్యగాక?
ఆ॥ వె॥ సర్వవంద్యుఁడైన శార్ఙ్గి సన్నిధిఁ జేర్చు
పథముగలదె భక్తిపథముగాక?
కాన నితఁడు భక్తి♦గలవారలకె కాని
పరుల కగ్గమగునె? ♦ పడఁతులార! 24

సత్య—(స్వగ) అక్కటా! అంధురాలనై ప్రాణేశుమహాత్మ్య మెఱుంగక తప్పు త్రోవ నడుచుచుంటి. నేఁటికి యాథార్థ్యంబు గోచరమయ్యె. రుక్మిణీమార్గమే సన్మార్గమయ్యె.

నార—కాంతలారా! భక్తులెవరైన నొక తృణము నైచినను నీ మహానుభావుని దులను దూఁప సాధ్యమగు. అట్టివారిని నెమకి ప్రార్థించి తోడితేవలయు.

సత్య—(ఆతురతతో) మునీంద్రా! అట్టివార లెవ్వరైన గలరా?

నార—చేలా! అందులకు సందియమా? భక్తులే లేకున్న నీలోకము పాడుగదా!

సత్య—అట్టి మహాత్ము లెచ్చోట నున్నారు?

నార—ఎచ్చటనో యననేల? ఈ పురముననే యున్నారు.

సత్య—వా రెవరో తెలియఁజేయుఁడు. పాదములఁబట్టి ప్రార్థించి తెచ్చెదము.

నార—నిక్కముగా నట్లొనర్చెదవా?

సత్య—అందులకు సందియమా? చెప్పి చూడుఁడు.

నార—నేఁ జెప్పినంత నీవు మాటతప్పక య ట్లొనర్తువుగదా!

సత్య—మునీంద్రా! నా మాటయం దింత యవిశ్వాస మేల? వా రెవరో తెల్పుఁడు.

నార—ఎవరో కాదు, చెప్ప మనెదవా?

సత్య—ఇంతసంశయ మేల? దయచేసి సెలవిండు. ఎవరైన గాని మ్ము. నే నేఁగి స్వయముగా వారిఁ దెచ్చెద.

నార—నీ...నీ...నీ...నీ సపత్ని రుక్మిణీదేవియే.

సత్య—అక్కటా! ఇది నిక్కమా? హాస్యమా!

నార—దేవి! ఇది హాస్యమునకు సమయమా? ఆ భక్తురా లొక తృణముఁ దెచ్చివైచినను శ్రీకృష్ణుండు తులఁదూఁగును. నామాట నమ్మకున్న నీ భర్తనే యడుగుము.

సత్య—ప్రాణేశా! ఇది యథార్థమే యగునా? లేక యీ జగడాల చెలియును, మీరును గలిసి నన్నుఁ బరిభవింపఁ బన్నిన పన్నాగమా? (పాదములపైఁ బడి).

శా॥ నీమాహాత్మ్య మొకింతయుం గనక యంధీభూతచేతస్కనై
సామాన్యంబలె నెంచి చేసినది దోషం బంచుఁ గన్గొంటి నేఁ
డామూలాగ్రము గర్వమెల్ల మటుమాయంబయ్యె, గోపాలకృ
ష్ణా! మన్నింపుము నీదుసత్య నిఁకనైనన్ సానురాగంబుగాన్.

కృష్ణ—సత్యా! తెమ్ము. నారదుఁ డాడినది వాస్తవంబ. భక్తిలేక ధనమిచ్చికాని ధాన్యమిచ్చిగాని వస్త్రవాహనాదు లొసఁగికాని గుడులు గోపురములు కట్టించిగాని నన్ను వశపరచుకొనుట కల్లోనివార్త. భక్తితోఁ బత్రమైనను, ఫలమైనను, దోయమైనను, బుష్పమైనను నెవ రొసంగుదురో వారికి నే దాసుఁడనై వర్తించెద. ఇదియే భక్తిమాహాత్మ్యము. ఇంకఁ గర్తవ్య మొనర్చి ననుఁ గైకొనుము.

ఉ॥ నారదుఁ డాడినట్టి వచనమ్ము యథార్థముగాన, రుక్మిణీ
సారసపత్రనేత్రి సరసం జని ని విటఁ బుణ్యకవ్రతే
చ్ఛారతిఁ జేసినట్టి యవిచార్యపుఁగార్యముఁ దెల్పి తెమ్ము, చే
కూరును నీయభీష్ట, మొనఁగూడును మోదము భక్తకోటికిన్. 26

సత్య—అకటా! నాథా! నా సపత్నినే పోయి వేఁడుకొనుమని యెదరా? ఇంత తెలివితక్కువపని సల్పి యేమొగముతో నా కాంతెదండ కేఁగుదును? మీ కేల యింత పక్షపాతము? నాగర్వాపహారణమునకై నన్నిట్లు విషమపరీక్ష చేయఁజెల్లునా?

మ॥ భువిపై నాచరితంబు లెల్లరకు నవ్వుంబాటుగాఁ జేసియున్
భవదీయప్రణయంబు నాకిటులు దుష్ప్రాపంబు గావించియున్
లవమైనన్ మదిలోనఁ దృప్తిని గనన్గాలేక యీ వైఖరిన్
సవతి న్వేఁడగఁ బంచెదే? మురహారీ! సాధించుటల్ చాలదే?

నార—కృష్ణా! రమ్ముఁ, జెప్పవలసినదేమో చెప్పితిమి. నిన్ను వలచినదైన నీవు బోధించునట్లొనర్చి నిన్నుఁ బ్రతిగ్రహించును. మనము దానమండపమున కేగుదము రమ్ము.

(కృష్ణ నారదులు నిష్క్రమింప).

సత్య—నాథా! పోయెదరా! నేను రుక్మిణిని వేఁడుట తప్పదా?

జాంబ—సాత్రాజితీ! నీ వొనర్చిన యవివేకపుఁ గార్యమునకుఁ దోడు కుళంకలు గూడనా? రమ్ము.

మిత్ర—కాల మెప్పుడు నొకటేగతిగ నుండు ననుకొంటివా? మొన్నఁ బారిజాతాపహరణమున నీకు విజయమయ్యె. నేఁడు పుణ్యక వ్రతవిషయంబున మా నెచ్చెలికి జయముగా నున్నది. జయాపజయంబులు కావడికుండలు. ఇందులకుఁ జింతింపక రుక్మిణి కడకుఁ బోవుదము రమ్ము.

సత్య—సపత్నులారా! మీరే రుక్మిణికడ కేఁగి నాకు మాఱు ప్రార్థించి తోడితెండు.

జాంబ—మగనిని జేతులార దాన మిచ్చినదానవు నీ వుండ నాగొడవ మాకేల? మఱియు దానివలన మాకగు లాభమేమి?

ఆ॥ వె॥ నేఁటిదాక శౌరి ♦ నీయింట నుండిన
నేఁడు మొదలు మా♦తోడ నున్న
మాకు సమమె యగుట ♦ మా కేమి పట్టెను
భీష్మపుత్రిఁ బోయి ♦ పిలిచిరాఁగ? 28

మిత్ర—సాత్రాజితీ! కార్యముపట్ల నిట్లు గర్వించుట తగునా? ప్రాణేశ్వరుఁడు నిన్నుగదా! పోయి రుక్మిణిం బిలిచిరమ్మనియెఁ రమ్ము. వచ్చెదవా లేక మమ్ము పొమ్మందువా?

సత్య—అక్కటా! ఎట్టి దురవస్థ వాటిల్లె?—

చ॥ పడఁతిరో! నాగృహంబునకు ♦ వచ్చి ననుం బరితృప్తఁ జేయుమం
చడుగులఁబట్టి వేఁడుకొని♦నప్పుడు పొమ్మని తూలనాడి, యీ
యెడల విదర్భరాజసుత♦యింటికి సిగ్గునువీడి పోయి యే
వడిఁ బతిభిక్షఁ బెట్టు మని ♦ ప్రార్థనఁ జేసెదు దాననోకదా! 29

ఒకవేళ నేను గర్వము విసర్జించి పోయి రుక్మిణీదేవిని వేఁడుఁ కొందునుగాక! ఆ తన్వి నన్నుఁ జక్కగా సన్మానించునో లేక

జరిగినవిషయములఁ దలపోసి వన్నెత్తిపొదుచునో? పతితః పర్వతో లఘు వందురుగదా!

జాంబ—సాత్రాజితీ! రుక్మిణీదేవి శాంతమూర్తి, కృపావిస్తారవారాశి, పావనచరిత్రి, పతివ్రతాశిరోమణి, దీనరక్షణకళాపారీణ. అట్టి వ్నఁటికిని దూలనాడదు. రమ్మ.

సత్య—అట్లే వచ్చెద. ఇంకను నాకీగర్వమెందులకు? రండు.

(నిష్క్రమింప యవనిక పడును.)



## చతుర్థరంగము.



స్థలము : రుక్మిణీదేవి శుద్ధాంతము - తులసీవనము.

(రుక్మిణి సుస్నాతయై పట్టువస్త్రంబుఁ దాల్చి తులసి వృక్షమునకుఁ బూజయొనర్చుచుండును. జాంబవతీమిత్రవిందలు ప్రవేశించి)

జాంబ—దేవీ! సాత్రాజితి నీయింటికి వచ్చుచున్నది.

రుక్మి—నెచ్చెలీ! నీ వేమైనఁ బొరపడితివా యేమి? సత్యభామ యేమి, నాయింటికి వచ్చుటేమి?

మిత్ర—కార్యము కలిగినది. వచ్చుచున్నది, అదిగో.
(సత్యభామ ప్రవేశించును.)

రుక్మి—(స్వగ) పిరిమాటలు నిక్కమయ్యె. (ప్రకా)

ఉ॥ ఏమిది సత్యభామ! యిటు • లేటికి మంగళసూత్రశేషనై
మామకమందిరంబున క•మందగతిం జనుదెంచినావు? ని
న్నా మధుసూదనుండు విడ•నాడి చరించెనొ? లేక నీవయిం
బ్రేముడిఁ బాసెనో? తెలిపి • వేగమె నామది భీతిఁబాపుమా!

సత్య—(నమస్కరించి) అక్కా! ఏమని చెప్పుదును? నేను మీ యెడఁ బూర్వమొనర్చిన యపచారముల నన్నింటిని మనః పూర్తిగా మన్నించి నాకీ యాపత్కాలమున దోడ్పడ వలయును.

రుక్మి—సత్యా! నీవు నాకేమియు నపచారము లొనర్పలేదు. కాన నేను క్షమించుట కేమియు లేదు. నీకు గలిగిన విపత్తెట్టిదో తెల్పుము. సాయము నాచే నగునేని తప్పక యొనర్చెద.

సత్య—అక్కా! నే నొనర్చిన తెలివిమాలినపనిని జెప్పుటకు నాకు నోరాడకున్నది. నెచ్చెలులారా! మీరు నాపై దయయుంచి తెలుపుఁడు.

జాంబ—సత్యా! ఇంతను గొంత యాభిజాత్యమా?

మిత్రి—సత్యా! చేసినపాపము చెప్పిన నించుక పోవునేమో నీవే చెప్పుము.

సత్య—అక్కా! నిన్న నారదమునీంద్రుఁడు నాకడ కేగుదెంచి ప్రాణేశ్వరు పూర్ణానురాగంబు సంపాదింప నాకుఁ బుణ్యక వ్రత ముపదేశించె. నేఁడు ప్రాతఃకాలమున నా వ్రత మాచరించి తద్విధానానుసారంబుగ మన ప్రాణేశ్వరు నా మునీంద్రునకు దాన మిచ్చితి.

రుక్మి—అక్కటా! చెలా! మగువలకు మగనితోడి బ్రదుకే మంగళం బని ప్రాజ్ఞులు పల్కుచుండ భర్తృదాన మిచ్చు వ్రత మొక వ్రతమా? మనపుణ్యపరిపాకంబున లభించిన మాధవుని దాన మియ్య నీ కెట్లు మనసొప్పె? అతఁడు మననాథుఁడు మాత్రమే గాక జగన్నాథుఁడుగదా! మఱియు నతఁడు సర్వకామదుఁడే అతని దానమిచ్చిన చేకూరు కామ్య మెద్ది?

క॥ సురమర్త్యయక్షకిన్నర
గరుడప్రముఖులకు సర్వ•కామదుఁ డగు శ్రీ
వరు నొరున కొసఁగి నీ వే
కరణి మనోభీష్టమందఁ • గాంక్షించితివో? 31

సత్య—అక్కా! నా వెడఁగుఁదనంబు నే నిప్పు డిప్పుడు గ్రహించు చున్నాను. నారదుఁడు తనకు నాథుని బరువు ద్రవ్యముఁగాని, ద్రవ్యేతరముఁగాని యిచ్చి మఱల గ్రహింపవచ్చు నన, నిశ్చింతమై నాదానంబునకుఁ గడఁగితిని. అ ట్లొనర్పఁ దుల యం దెంత వైచినను నాథుని దూఁపలేకపోయె.

రుక్మి—అయ్యో, సత్యా! మననాథుఁడు విశ్వరూపుఁడు. అతనిఁ దూఁచు పదార్థ మొండైనఁ గలదా? ఇన్ని యెఱిఁగియు నతని మనుజమాత్రుం డని యెట్లు నమ్మితివి? చూచుటకుఁ గన్నులును, వినుటకు వీనులును, గ్రహించుటకు మనం బును లభించియు నయ్యవి వ్యర్థమయ్యెనా?

సీ॥ పూతనాసురిని వి♦ఘాతంబు గావించె
శకటాసురుని జీవ♦విరళుఁ జేసె
గోవర్ధనం బెత్తి ♦ గోపతి భంగించె
ధేనుకాసురు గత♦ప్రాణుఁ జేసె
వ్యోమకాసురు సుర♦ధామంబునకుఁ బంపె
కంసనృశంసుని ♦ కసిమసఁగెఁ
కాళీయుఫణిఫణా♦గ్రములఁ దాండవ మాడె
శిశుపాల దుర్జాతు♦శిరముఁ ద్రుంచె
ఆ॥ వె॥ శిష్టజనుల బ్రోచె దుష్టుల ♦ ఖండించె
ధర్మమును నిలిపె న♦ధర్మ మడఁచె
మనతపఃఫలంబు ♦ మనసన్నిధానంబు
మనశుభంబు మనుజ♦మాత్రుఁ డమ్మ!

మత్స్యకూర్మాద్యవతారముల నెత్తి లోకత్రాణ మొనర్చిన మహనీయచరిత్రుండు మనయింటనోనా పుట్టైన నందనందనుండు గాక యున్నాఁడా?

సత్య—అక్కా! ఇన్నాళ్ళు శ్రీకృష్ణు సన్నిధిగనయ్యుఁ దీర్ఘంబున నుండు మానంబునకుఁ దీనమాహాత్మ్యముఁ దెలియనట్టు లంధపరిక్రియఁ గాలముఁ బుచ్చుచుంటి. ఈ పుణ్యకవ్రతవ్యాజంబున యాథార్థ్యంబును గంటి. ఇప్పుడు నారదమునీంద్రుండు శ్రీకృష్ణుని దూఁడమునకు నన్నుం దోడి తెమ్మనియె. నీవు మా వెంట దానమండపమున కరిగి ప్రాణేశ్వరు నారదదాస్యవిముక్తుఁ జేయుము.

జాంబ—సత్యా! మాయక్క రుక్మిణి పెన్నాఁడు తెలిదమ్ముళ్ళు పెట్టిన సొమ్ములన్నియుఁ గనిసా మున్నెక పెన్నకాస్సైన నెఱుఁగవుగదా! ఆమహానుభావుఁ డేనితోఁ దూఁగఁగలఁడే?

సత్య—నెచ్చెలులారా! మీరు ప్రాణేశ్వరుని మునీంద్రుని వాక్యము లాలించియు నిట్లాడనగునా? ఈ వైదర్భి కెడ భక్తిధన మేయుండ

వేయుధనమేల? శ్రీకృష్ణుఁడు భక్తైకవశంగతుఁడు గదా!
మఱియు—

మ॥ నను నీనారదమౌనినుండి విలుచఁగ ♦ గాంచెఁదువాఁడేని చ
య్యన వైదర్భిని దోడితెమ్మిఁచటి కిం ♦ చాత్మేశ్వరుం డానతి
చ్చెను గానం గరుణార్ద్రచిత్త వగుచున్ ♦ శీఘ్రంబుగాఁ బైనమై
మన ప్రాణేశ్వరుఁ గృష్ణుఁ దూఁచికొన నిమ్మా మానినీరత్నమా!

రుక్మి—సోదరీ! ప్రాణేశ్వరుఁ డానతిచ్చిన నే వెనుదీయుదునా? అట్లె పోవుదము రండు.

సత్య—అక్కా! పోవుదముగాని దేనితో శ్రీకృష్ణుఁ దులను దూఁచెదవు.

రుక్మి—చెలా! దేనితో నన నేల? భక్తియొండుండవలయుఁగాని దేనిచేనైన నీకార్యమును సాధింపఁగూడదా? ఐన హరిసమారాధనమునకుఁ బ్రధానము తులసీదళ మని పెద్ద లందురు. దీని నొక దానిఁగొని శ్రీకృష్ణునికడ కేఁగుదము.

సత్య—అక్కా! ఈతులసి కంతప్రభావ మున్నదా?

రుక్మి—చెచ్చెలులారా! తులసీమాహాత్మ్యము వర్ణనాతీత మని మీ రెఱుంగరా! ఈతులసి విష్ణుప్రియ. ఈ తులసీపూజనంబు భక్తిసాధనములలో నుత్తమోత్తమంబు. కావున మనబోంట్ల కవశ్యమాచరణీయంబు.

సీ॥ తులసీమహీజంబు ♦ విలసిల్లుస్థలమున
సిరియును వాణియు ♦ వెలయుచుండ్రు
తులసిచెట్టున కొక ♦ కలశంబు జలమిడఁ
బాపౌఘములు పటా ♦ పంచ లగును
తులసీదళంబు నొఁ ♦ డల ధరియించిన
కరతలామలకమౌఁ ♦ బరమపదము
తులసివృక్షమును బూ ♦ జలచేతఁ దన్పినఁ
బుణ్యంబులెల్లను ♦ బ్రోవి గాంచు

తే॥ గీ॥ హరిసమారాధనకు వసుంధరను దులసి
గంటె మించినవస్తు వొకండు లేదఁ
టంచు బుధులాడుచుండు రో యతివలార!
తులసియే తగు మాధవుఁ దులనుదూఁచ. 34

సత్య—అక్కా! నీయుపదేశప్రకార మింక హరిపూజనముంబోలెఁ దులసిపూజనమును నిత్య మొనర్చెద.

జాంబ—దేవీ! మాకును సత్యాదేవిప్రతమూలంబున నజ్ఞానంబు ధ్వంసమయ్యె. మేమును నట్లే యొనర్చెదము.

మిత్ర—ఇంక! నీచరిత్ర మార్గదర్శకముగా సర్వదా మెలంగి కృతార్థచరిత్రల మయ్యెదము.

రుక్మి—నెచ్చెలులారా! మీమాటలు నా కెంతయు సంతసముఁ జేకూర్చె. ఇంకఁ దులసీదళ మొకటిఁ గోసికొని దానమంటపమున కేఁగుదము.

(హారతియెత్తి తులసిచుట్టు మూఁడుమారులు ప్రదక్షిణ మొనర్చి యొక తులసీదళమును గోసి పళ్ళెరమునందుంచి రుక్మిణి సపత్నులతోఁ గలిసి నిష్క్రమించును.)



## పంచమరంగము.

---

స్థలము: దానమంటపము — తులాభారము.

(శ్రీకృష్ణుండు తులలోఁ గూర్చుండి యుండును. నారదుఁడు వెంబడి నిల్చియుండును. వసంతకుఁడు నలిని వేఱొకప్రక్క నిలిచియుండును)

నార—దేవా! మాతలిచేఁ బారిజాతవిటపంబును ద్రివిష్టపంబునకుఁ బంపించితి. ఇంకఁ దులాభారమే మిగిలియున్నది.

కృష్ణ—వసంతకా! రుక్మిణి యింకను రాలేదా?

వసం—వయస్యా! అదిగో వచ్చుచున్నది ఒక పళ్ళెరమునఁ దులసిం దెచ్చుచున్నది.

కృష్ణ—ఓహో! నారదా! చూచితివా? తులసీదళమును దెచ్చుచున్నదఁట!

నార—దేవా! అదియేగదా వలసినపదార్థము. తులసికంటె మీకుఁ బ్రియమైనవస్తు వున్నదా?

(రుక్మిణీదేవి తులసీదళమును బళ్ళెరమున నుంచుకొని సత్యాజాంబవతీ మిత్రవిందాసమేతయై ప్రవేశించును.)

రుక్మి—మునీంద్రా! మాచెల్లెలు సత్య నడిపినది నిజమేనా?

నార—విదర్భరాజపుత్రీ! అవును.

సీ॥ పతిపూర్ణరాగంబుఁ ♦ బడయంగ సత్య న
న్నాఁవ్రతం బొందు ♦ నడుపు మనియె
నే నడిపినయంతఁ ♦ దా నది గావించి
వ్రతఫలార్థము నాకుఁ ♦ బతి నొసంగ
నొసఁగినయంత నే ♦ ముసలక నాథుని
దుందూఁచి కొన ధనా ♦ మలను గూర్చె
గూర్చిన నయ్యవి ♦ కొఱగామి మేము ని
న్నోడితెమ్మని పంపఁ ♦ దోడి తెచ్చె

తే॥ గీ॥ నింకమీఁద నీవు ♦ పంకజాలాక్షి! యే
వస్తుసమితితోడ ♦ వాసుదేవుఁ
దులను దూఁచికొనఁగ ♦ దలఁకొనుదానవో
తెలిపి యాత్మనాథు ♦ పిలిచికొనుము. 35

రుక్మి—అట్లయొనర్చెద. ఇదిగో నానాథునిదూఁచు వస్తువును దెచ్చితిని. చూడుఁడు. (కృష్ణునిచుట్టు మూఁడుసారులు ప్రదక్షిణ మొనర్చి మోఁకరించి) దేవదేవా! పురాణపురుషా! వేదాంతవేద్యా! దీనావనా! భక్తవత్సలా! నీప్రభావ మెఱుంగ నేరికి శక్యంబు? నీ లీలలయర్థంబు గ్రహింప నేరికి సాధ్యంబు? నీ యదార్థరూప మెవ్వరికి గోచరంబు?

ఉ॥ సత్త్వరజస్తమోగుణవ♦శంబున మూర్తులమూఁటి దాల్చి బ్ర
హ్మత్వము నంది లోకనిచ♦యంబుల నెల్లను సృష్టిఁజేసి, వి
ష్ణుత్వము నంది లోకముల ♦ జొక్కపురీతిని నేలుకొంచు, రు
ద్రత్వము నంది వానిని హ♦రంబొనరించెద వీవె మాధవా! 36

నీవు నిర్వికారుఁడవు, నిరంజనుఁడవు, నిర్గుణుఁడవు. నీ మహిమ నెఱుంగనేరక ప్రాణులవిద్యాసంజాతమైన యహంకారమమకారముల కిరవై చచ్చుచుఁ బుట్టుచుఁ బుట్టుచుఁ జచ్చుచు నుందురు. ఒకానొకరు క్లేశానుభవంబునఁ గన్నుల పొరలూడ సత్యముం గనుంగొని నీపాద సేవయే జన్మవిముక్తికి హేతువని యెఱింగి కాలంబునంతయు నంద వినియోగించి నీకు భక్తులగుదురు. అట్టివారలకు నీవు వశుఁడవై చరించుచుందువుగదా! భక్తవత్సలా! ఇంక నేవచ్చిన కార్యమునకుఁ గడంగుటకు సెలవిండు.

కృష్ణ—రుక్మిణీ! అట్లనె నచ్చి నాభక్తులలో నగ్రగణ్య వగుము.

రుక్మి—మీయాశీర్వాద మున్న నాకది యెంతపని? సత్యా! ఈతుచ్ఛ పదార్థములు నీ తులనుండి తీయింపుము.

సత్య—నళినీ! అట్లొనర్పుము. (నళిని వస్తువు లట్లొనర్చు)

(రుక్మిణి తులసీదళముఁ గన్నులనద్దుకొని తులయందుంచఁబోవుచుండ)

కృష్ణ—సత్యా! అట్లే యగు. నీ కేమైనఁ గామ్యమున్నఁ దెల్పుము. ప్రసాదించెద.

సత్య—దేవా! ఇంకను నాకుఁ గామ్య మేమి యుండును? అయిన నన్నును రుక్మిణిదేవింబోలె మీ భక్తురాలిం జేయుఁడు. అదియే నాకుఁ గామ్యము.

శా॥ నీ కైంకర్య మొనర్చునట్టి కరముల్ ♦ నిన్గాంచు నేత్రంబులున్
నీ కశ్రాంతము మ్రొక్కునట్టి శిరము ♦ నీ సేవపై బుద్ధులన్
నీ కావ్యంబుల నాలకించు చెవుల ♦ న్నిన్నెంచు జిహ్వాగ్రమున్
సాకల్యంబుగ నా కొసంగు హృదయే♦శా! భక్తచింతామణీ!

కృష్ణ—అట్లేయగుఁగాక! (రుక్మిణీసత్యభామల కరములఁ బట్టుకొని) నారదా! సురకార్యంబు నెరవేఱెనదా? ఇం కేమి వలయు?

జాంబ—దేవా! నన్నును సత్యంబోలె ననుగ్రహింపుఁడు.

మిత్ర—ప్రాణేశా! నన్నును నీ భక్తాగ్రగణ్యఁ జేసి రక్షింపుము.

వసు—కృష్ణా! నామాటగూడ మఱువక నన్ను రక్షింపుము.

కృష్ణ—అట్లే యొనర్చెద.

నార—దేవా! నీ భక్తవాత్సల్యంబు లోకవిదితమయ్యె. ఇంద్రాణీ ప్రభృతులు పారిజాతలాభంబునఁ బరిమోదాన్వితలైరి. రుక్మిణీదేవిభక్తి తెల్లమయ్యె. సత్యభామాదేవిప్రేమంబు భక్తిగాఁ బరిణమించె. నా కలహమునకు శాంతిఁ జెందె. నా కిం కేమి కామ్య ముండును? అయిన నిట్లగుఁగాత—

భరతవాక్యము.

మ॥ జలజాతేక్షణపాదభక్తిపరులై ♦ సౌభాగ్యసంపన్నులై
తులసీపాదపపూజనప్రవణులై ♦ దోషప్రదూరాత్ములై
బలులై బల్లిదులై ప్రభావయుతులై ♦ భద్రాఢ్యులై భవ్యులై
కలకాలంబు చరింతురింగాత! భరతక్ష్మా♦ మాతృసంతానముల్.



సకలుండై సుగుణాఢ్యుండై సుజనుండై శుద్ధప్రబోధాత్ముండై
యకలంకుండయి, యార్తభద్రకరుండై యారాధ్యుండై యచ్యుతా!

సత్య—(నారదునికడ కేఁగి) మునీంద్రా! పుణ్యచరిత్రవ్యాజంబున నాకీ పురాణపురుషు నపూర్వమహిమంబు నెఱింగించి సన్మార్గంబుఁ జూపినందులకు నా కృతజ్ఞతావందనము లందికొనుము.

నార—దేవీ! ఇందు నా యుద్యమ మావంతయు లేదు. ఇదంతయు నీ మనోహరు విలాసమే సుమీ!

సత్య—(రుక్మిణికడ కేఁగి) అక్కా! నీభక్తివిశేషంబునఁ బ్రాణేశ్వరు బంధవిముక్తుఁ జేసి నన్నుఁబోలు సపత్నులందఱ కృతజ్ఞతకుఁ బాత్రురాలవైతివి. నేఁటితో నాయజ్ఞానంబు సర్వంబు రూపుమాసె. ఇఁక నీచరిత్ర మార్గదర్శకంబుగాఁ గొని ప్రాణేశుని సేవింపుచుండెద.

రుక్మి—సత్యా! స్త్రీ యొనర్చి భక్తురాండ్రఁ బేరుగాంచును. ఇంక ప్రాణేశ్వరుదండ కేఁగుదము రమ్ము

(శ్రీకృష్ణునిదండ కేగి నమస్కరింప నిద్దఱను లేవనెత్తి)

కృష్ణు—రుక్మిణీ! నీ కెంతయుఁ గృతజ్ఞుఁడను. నీభక్తిచే నన్ను నారదదాస్యవిముక్తుఁ జేసితివి.

రుక్మి—నాథా! సన్నిధి పేదకుఁ గృతజ్ఞతఁ జెప్పవలయునా? మీ భక్తులకు సాధ్యముకాని కార్య మెందు గలదా?

కం॥ అంబుధి కుల్యం బగు, సిం
హంబు కురంగం బగు, విష మమృతం బగు, శై
లం బల్పోపల మగు నో
యంబుజదళనయన! తావకాశ్రితతతికిన్. 40

కృష్ణు—సత్యా! నావలన నీవు కష్టములపాలు గావలసివచ్చెగదా!

సత్య—నాథా! ఇష్టఫల మంద నట్టి కష్టముల నెన్ని పర్యాయములైన ననుభవింపవచ్చు. వానిని గష్టము లన నేల? అవి నిరుపమాన మగు బ్రహ్మానందమునకు సోపానములు.

కృష్ణ—సత్యా! అట్లే యగు. నీ కేమైనఁ గామ్యము న్నఁ దెల్పుము. ప్రసాదించెద.

సత్య—దేవా! ఇంకను నాకుఁ గామ్య మేమి యుండును? అయిన నన్నును రుక్మిణి దేవింబోలె మీ భక్తురాలిం జేయుఁడు. అదియే నాకుఁ గామ్యము.

శా॥ నీ కైంకర్య మొనర్చునట్టి కరముల్ ♦ నిన్గాంచు నేత్రంబులున్
నీ కళ్యాణము మ్రొక్కునట్టి శిరము ♦ నీ సేవపై బుద్ధులన్
నీ కావ్యంబుల నాలకించు చెవులు ♦ న్ని న్నెంచు జిహ్వాగ్రమున్
సాకల్యంబుగ నా కొసంగు హృదయేశా! భక్తచింతామణీ!

కృష్ణ—అట్లే యగుఁగాక! (రుక్మిణీసత్యభామల కరములఁ బట్టుకొని) నారదా! సుర కార్యంబు నెరవేరెఁగదా? ఇం కేమి వలయు?

జాంబ—దేవా! నన్నును సత్యంబోలె ననుగ్రహింపుడు.

మిత్ర—ప్రాణేశా! నన్నును నీ భక్తురాలిఁ జేసి రక్షింపుము.

వసు—కృష్ణా! నామాటగూడ మఱువక నన్ను రక్షింపుము.

కృష్ణ—అట్లే యొనర్చెద.

నార—దేవా! నీ భక్తవాత్సల్యంబు లోకవిదితమయ్యె. ఇంద్రాది ప్రభృతులు పారిజాతతులాభారంబునఁ బ్రమోదాన్వితులైరి. రుక్మిణీదేవిభక్తి తెల్లమయ్యె. సత్యభామాదేవిప్రేమంబు భక్తిగాఁ బరిణమించె. నా కలహాతురత్వము శాంతిఁ జెందె. నా కిం కేమి కామ్య ముండును? అయిన నిట్లగుఁగాత—

భరత వాక్యము.

మ॥ జలజాతేక్షణ పాదభక్తిపరులై ♦ సౌభాగ్యసంపన్నులై
తులసీపాదపపూజనప్రముదులై ♦ దోషదూరాత్ములై
బలులై బల్లిదులై ప్రభావయుతులై ♦ భద్రార్థులై భవ్యులై
కలకాలంబు చరింతురెగాత! భరతక్ష్మామాతృసంతానముల్.

